## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015413

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



(నారాయణ శతకవర్ణమట్టు)

# శ్రీ రామ రామ శతకము.

## (పాట)

1 శ్రీరామ రామ రామా మముబ్రోవు శృంగారసుగుణధామా।
కోరివేడుచునుంటిమీమమ్మేలుకొనుము శ్రీరామరామా॥ శ్రీ
2 యిష్టదేవతలనెల్లా మతినమ్మినిష్టతో ధ్యానించియూ
స్పష్టముగ నీశతకమూ జెప్పెదానిష్టతో రామరామా॥ శ్రీ॥
3 ముందుగా విఘ్నేశునీ భారతిని మోదమలరా వేడియూ
అందముగ నీశతకమూ జెప్పెదాయాలింపు రామరామా॥ శ్రీ
4 లోకమంతయుచూడగా నీమాయలోనె మెలగుచునుండగా
నాకికాదిక్కెవ్వరూ నిన్నెనెరనమ్మితిని రామరామా॥ శ్రీ
5 యీజన్మవృత్తాంతమూ దెల్పెదావిశదముగ యాలింపుమూ
నాజన్మతరియింపగా దయజూచినన్నేలు రామరామా॥ శ్రీ
6 సతిపతులుగూడినపుడూ శుక్లంబుఋతువైన కమలమందూ
అతిశోణితమునగలసీ యీజన్మమాయ శ్రీరామరామా। శ్రీ
7 మొదటిమాసమునందునా సుదతికీముట్టుదప్పిన వెనకనూ
పదిలముగు స్థానమూనూగానకా పారాడె రామరామా॥ శ్రీ
8 రెండునెలలైనపిదపా నిన్నెపుడు అండబాయక వేడుచూ
దండిగాగర్భమందూ దిరుగుచూనుండె శ్రీరామరామా శ్రీ
9 పరగమూడూనెలలకూ నదిగట్టిపడి మూలస్థానమందూ
మురికిగర్భముయందు నాతావుండెముద్దగా రామరామా॥ శ్రీ

10 నాల్గునెలలైనవెనాట మరివేగనవసూత్రములు గల్గియూ
మేలగూనైదోనెలకూ కరపాదములు గల్గెరామరామా॥ శ్రీ
11 ఆరునెలలైనవెనాట నాళ్ళునూ అన్నిపూర్ణంబులయ్యా
కోరనీమహిమచేతా జీవుండు జేరెశ్రీరామరామా॥ శ్రీ
12 యేడునెలలైనపిదప మరియంతవృద్ధిపొందియు పిండమూ
చూడశ్రీగర్భమందూ కదులాడుచుండె శ్రీరామరామా॥ శ్రీ
13 అష్టమాసముయందునా జీవుడీనిష్టదెలశియు మూల్గుచూ
కష్టపూజన్మమేలా నాపూర్వఖర్మయనెరామరామా॥ శ్రీ
14 అంతనవమాసమూలూ సంపూర్ణమాయెజీవునకప్పుడూ
చింతగల్గియుమనమునా నినువేడుచుండెశ్రీరామరామా॥ శ్రీ
15 యీచీకటికోనలో యికనేను యెటులతాళ్లునననుచూ
వాశిగానినువేడుచూ నపుడుబయలొందెశ్రీరామరామా॥ శ్రీ
16 మహిమంత్రసానియపుడూ కలిసీళ్లుమొగముందుచల్లగానే
బ్రంహ్మజ్ఞానమువిడిచియూ కలిమాయకమ్మనదిరామరామా॥
17 మాయమంత్రసానియూవనితలూపాయకా బొడ్డుగోశి
పోయరేసీళనుచును జోలలూపాడిరీరామరామా॥
18 పుత్రచిన్నెలుబడుచునూ యప్పుడాధాత్రినీ తలిదండ్రిలూ
పుత్రునెత్తుకముద్దులూబెట్టికీ ప్రేమచే రామరామా॥ శ్రీ
19 యిదియంతనీమాయయేచూడగా నిదియంతనీమహిమయే
పదిలమగుధరకెల్లనూ సర్వాధిపతివయ్యరామరామా॥ శ్రీ
20 కలియుగంబునకిట్టులా బూటకముగాపించియీరీతిగా
చాలసుఖదుఃఖములలో మున్గునటుజేసితివిరామరామా॥ శ్రీ

21 నీమహిమ దెలియలేకా పామరులునీసరణిగానరాకా
నీనామమును నుడువకా చెడెదరూనిక్కముగ రామరామా॥
22 కుక్కనక్కలయందునా నేనుబహు పెక్కు జీవులయందునా
నిక్కముగ పుట్టిగిట్టిపిట్టవలెజిక్కితిని రామరామా॥ శ్రీ
23 యేసమయమందైననూ నినువేడ తోచదాయను మనసునూ
నాశగలసంసారమూ తీరదొకనిమిషంబు రామరామా॥ శ్రీ
24 పుట్టినప్పుడెనిన్ననూ బహుగానుపూజజేయుదమన్ననూ
గట్టిగాకలిమాయచే నేనిన్నుగానశ్రీ రామరామా॥ శ్రీ
25 మరికొన్నిదినములకునూ నీనామస్మరణజేయుదమన్ననూ
పరగనజ్ఞానమనెడీ చీకటిలో పడియుంటి రామరామా॥ శ్రీ
26 బాల్యకాలమునందునా నీనామభజన శేయుదమన్ననూ
బాలురతో నాటలాడా నామనసు పరుగులిడె రామరామా॥ శ్రీ
27 స్త్రీమచేప్రాయమందూ నీమంత్రపఠన జేయుదమన్ననూ
కామాంధకారమనేటీ చీకటీకమ్మినది రామరామా॥ శ్రీ
28 వాటమాప్రాయంబునానినునమ్మి వాశిగనుగొలుతమన్నా
సూటిగాయవ్వనంబు స్త్రీలపైనాటెనది రామరామా॥ శ్రీ
29 మేలగూనీపాఠముల్ జనువుచూమదినిన్నుగొలుతమన్నా
స్త్రీలతోరతులదేలామనసుభ్రమజెందినది రామరామా॥ శ్రీ
30 మరికొన్నిదినములకునూ నీసేవమక్కువతో జేతమన్నా
మురిపముతో సతిగూడియూనినుమదీమరచితిని రామరామా॥
31 అంతటానైన నిన్నూమదినమ్మి యాత్మలోగొలుతమన్నా
సంతులేదనిమనమునా యొక్కింతచింతామె రామరామ॥ శ్రీ

32 సంతుగల్గిన వెనుకనూ నినునమ్మి చాలగాగొలుతమన్నా
సతిసుతులపోషణంబూ జేసేటిశ్రమగల్గె రామ రామా॥ శ్రీ

33 ధనధాన్యములు లేవనీ దిగులొందిధాత్రినీ పాటుబడుచూ
మనమరలసినువేడనూ కొన్నాళ్లుమరచితిని రామ రామా॥ శ్రీ

34 భూజీవంబు నాకూ యింకానుపూర్తిగా లేదనుచునూ
యీజన్మతృప్తిలేకా కొన్నాళ్లుయుండె శ్రీరామ రామా॥ శ్రీ

35 పాడిపంటలు లేవని బహుగాను పశువులూ లేవనుచునూ
మెండైనదుఃఖమందూ కొన్నాళ్ళు మునిగితిని రామ రామా॥ శ్రీ

36 యివియన్ని సమకూరగా మరియికా వీనిపోషణయెట్లనీ
నవిరళంబగుమనసుకూ ఖేదంబు నాటినది రామ రామా॥ శ్రీ

37 పశువులకు మేతయనుచూ మరిచూడ శిశువులకుయన్నమనుచూ
యిసుకుజెందియుప్రాణమూ నినుమరచియుంటి శ్రీ రామ రామా॥ శ్రీ

38 ధనముగల్గిన వెనుకనూ మరిదానిదాచుటా యెట్లనుచునూ
మనము నాభయముగలిగీ కొన్నాళ్ళు మెలగితిని రామ రామా॥

39 సంసారమనెడినదిలో మునిగి నేచాలశ్రమలను జెందుచూ
లేశమైననుతడవికా నినువేడ లేదు శ్రీ రామ రామా॥ శ్రీ

40 పగటివేళలయందునా నినువేడ పనిపాటలును తీరవూ
అగణితంబగు రాత్రియూ శయనించుటాయె శ్రీరామ రామా॥

41 నాపాదములు జేసినా పాపంబు నవలకును రానివ్వదూ
నీపాదభక్తియొసగీ నన్నేలు నిక్కముగ రామ రామా॥ శ్రీ

42 నామనసు జేసినట్టీ పాపంబు నీభక్తి నిలుపనివ్వదూ
ప్రేమచేగొనియాడనూ అనుకూలపడదాయె రామ రామా॥ శ్రీ

43 నానోరు జేసినట్టి పాపంబు నీస్మరణ జేయనివదూ
నానోటికిల్బిషంబూ నెడపాపిన న్నేలు రామరామా॥ (శ్రీ)
44 నాచేతులును జేసినా పాపంబు నీపూజ జేయనివదూ
నీచుండ ననుచు నన్నూ దూరముగ నెంచకుము రామరామా॥
45 నాకన్నులును జేసినా పాపంబు నీరూపుజూడ నివ్వదూ
నాకికాది కెక్కువ్వరూ దయజూచి నన్నేలు రామరామా॥ శ్రీ
46 నాకర్ణములు జేసినా పాపంబు నీకధలు విననివ్వదూ
నీకంటెముఖ్యమెరుగా బ్రోవుమూ నిక్కముగ రామరామా॥ (శ్రీ)
47 నాశిరసు జేసినట్టి పాపంబు నీకు మ్రొక్కనివ్వదూ
దోసిలొగ్గియుంటి నీబ్రోవుమిక దయజూచి రామరామా॥ శ్రీ
48 వేగిలేచినది మొదలూ సంసారసాగరంబున నీదుచూ
బాగుగా నీస్మరణయూ జెయలేదు భక్తితో రామరామా॥ శ్రీ
49 చూడ ఋణసంబంధమూ యివియన్ని సుతహితాసతిపశువులూ
నేడు యీ ఋణము తీరాగా నెమ్మతినొందు శ్రీరామరామా॥ శ్రీ
50 ధనధాన్యములు నన్నియూ నశ్వరశ్వితంబులూ పరిచూడగా
ఘనమగూ సుకృతంబూ నొక్కటేగాచు శ్రీరామరామా॥ శ్రీ
51 అర్థమెంతయునున్ననూ తనగృహమందెహాటకంబున్ననూ
వ్యర్థముగ వెళ్లవలయూ తదనాంతరంబు మా॥
52 బంధుమిత్రులునందరూ స్మశానభూమి దనుక నెవత్తురూ
పొందుగా తనతో నెవరూ యిహపరముపోరు శ్రీరామరామా
53 యమభటులువచ్చి వేగా తీసుకొని వెళ్లేసమయమందూ
యేమి జెప్పెదవనుచునూ యేడ్తురూయల్లరును రామరామా॥

54 కాలయముడొచ్చి వేగా పాశముల ఘనముగా నేయు వేళ్ళా
గోలగా యేడ్చినా నూ మరణంబు ఖాయంబు రామ రామా॥ శ్రీ
55 యిల్లు వాకిలి యెవరిదో మరి చూడ యిల్లాలు యెవ్వరోనూ
పిల్లలూ యవ్వరిదియూ కలియుగా బూటకము రామ రామా॥ శ్రీ
56 పరికింపనివియన్నియూ వుళ్ళకే పాపపుణ్యములు రెండే
సరగునాతనతో పాటూ యిహ పరము జేరు శ్రీరామ రామా॥ శ్రీ
57 గానవివియన్ని విడచీ యిక నిన్ను పూనికతో ధ్యానించెదా
మనమలర బ్రోవుమిక నూ నమ్మితిని మాధవా రామ రామా॥ శ్రీ
58 అన్నింటి పైయాశయూ విడచీ నేనిన్ని మనమున నమ్మియూ
సన్నుతీ జేయుచుంటినన్నేలు సరగునా రామ రామా॥ శ్రీ
59 కంటికినిదుర మానీ మరిచూడ వంటికిని సుఖము లేకా
యింటిపై యాశ విడచీ నిను వేడుచుంటి శ్రీరామ రామా॥ శ్రీ
60 తెలిసి తెలియక నెన్ని యోకిల్బిషంబుల జేసియున్నాడనూ
చల మేల ఘోరమైనా దురితముల చెండు శ్రీరామ రామా॥ శ్రీ
61 మాతృపూజయు సేయకానే బహుమదముచే దూషించితీ
ధాత్రి నా నేరములనూ మన్నించి దరిజేర్చు రామ రామా॥ శ్రీ
62 జనకాజ్ఞమీరి నేనూ బహుగాను చరియించియున్నాడనూ
ఘనముగూ నా నేరముల్ నెంచకా కడి తేర్చు రామ రామా॥ శ్రీ
63 గురుపూజలను సేయకా మహాత్ములా గురి నేను దెలియలేకా
పరిహాసించితి వారి నీ దయజూచి పాలించు రామ రామా॥ శ్రీ
64 దైవంబులనక నేనూ పెక్కుదుర్భాషలాడినానూ
దేవ నీవాడనికనూ దయజూడు దీనుడ రామ రామా॥ శ్రీ

65 పరులదూషించినానూ నేనుబహుపాపముల జేసినానూ
గురునింద జేసినానూ దీనుడనుకరుణించు రామరామా॥ శ్రీ
66 చాడీలుగాశినానూ నేబహూసజ్జనులదిట్టినానూ
కూడితినిపరసతులనూ దురితములగూల్చుశ్రీరామరామా॥ శ్రీ
67 యందరెన్నియుజెప్పినా వినక నేమందమతినైతిరుగుచూ
ముందుత్రోవనుగానకాయిటులైతి మూర్ఖుడను రామరామా॥
68 మరిచూడవేగిలేచీ నేనాడుమాటలన్నియుబొంకులూ
సరగునాపరులపైనా జెప్పితినిచాడీలు రామరామా॥ శ్రీ
69 వావివరుసలులేకనూ బహువారకాంతల గూడితీ
భావమునసానేరముల్ దలుపంగ పాటగున రామరామా॥ శ్రీ
70 నీచకార్యములు జేసీ నేలోకనిందెలనుబొందితుదకూ
గాచితినినీసరణికైయిక నైన కడతేర్చు రామరామా॥ శ్రీ
71 యెందుకీసంసారమూ నీపూజలందిసేయనిమోహమూ
యిందునాకికయవ్వకూనీ వెగతి యన్నిటికి రామరామా॥ శ్రీ
72 యెన్నిలోపములున్ననూ నాయందునెంచక నవియన్నియూ
మన్నించిబ్రోవుమికనూ దీనుడను మాయయ్య రామరామా॥
73 యంతవేడుచునున్ననూ నాపైనిసుంతైనదయరాదుగా
పంతమేలనునాపయీ నీపాదభక్తుడను రామరామా॥ శ్రీ
74 జగమెల్లనీమహిమచే సర్వంబునెగడుచునున్నదనుచూ
అగణితంబగు యశమునూవినియుంటియాశ్రితుడ రామరామా॥
75 పిలచినాపలుకవేలా మరినీవుతలపులాకందవేలా
కలకాలమునుభక్తులా పైయింతకఠినమా రామరామా॥ శ్రీ

76 వర్ణింపనీరూపునూ వ్యాసకులవాల్మీక మౌనిగానూ
స్మరణజేసేటిభక్తుడ్క కోరికలుసమకూర్చు రామరామా॥ శ్రీ
77 సీతోడవనభూములా విహరింపనేను లక్ష్మణుడగానూ
ప్రీతితో యల్లపుడునూనినుగొల్చుభక్తుడను రామరామా॥ శ్రీ
78 సీతోడపరుశోక్తులానాడుటకు నేనుభూపుత్రిగానూ
ఖ్యాతిగానినుగొల్చేటీ భక్తుండకడతేర్చు రామరామా॥ శ్రీ
79 దోశిలోగ్రియుభక్తులా మిటునిన్నుగాచియుంటిమియుక్తులా
యేసంశయంబుగలదూ మమ్ముబ్రోవవేమిశ్రీరామరామా॥ శ్రీ
80 మునురామదాసునిన్నూగొనియాడ ఘనముగావరములొసగీ
పనులెల్లచక్కజేసి బ్రోచినాప్రభుడవో రామరామా॥ శ్రీ
81 అలవిభీషణునినున్నూమదినమ్మి యాదరించుమామనగనూ
కలకాలమునుండునటులా పట్నంబుగట్టితివి రామరామా॥ శ్రీ
82 ధరనీనుభక్తులకునూ మునునీవెదారిజూపినతండ్రివీ
స్మరణజేసెటిభక్తుడానను బ్రోవు స్వేశ్చతో రామరామా॥ శ్రీ
83 భూములిమ్మనియంటినా నిన్నునే భూషణములిమ్మంటినా
కామితార్థములొసగియూమమ్ముబ్రోవుకరుణతో రామరామా
84 స్థిరవరములిమ్మంటినా నిన్నునేపురములిమ్మనియంటినా
సరగూనానన్నునీదూదరి జేర్చుచాలు శ్రీరామరామా॥ శ్రీ
85 భక్తుడిటువేడుచుండా నీకింతభారమాయన బ్రోవనూ
భక్తవరులా బ్రోచెటిబిరుదునూ పాలించు రామరామా॥ శ్రీ
86 ప్రీతితోనావార్తనూ మాతల్లిశీతమ్మయైనగానీ
సీతోనుజెప్పదాయెయిక నేమిసేతు శ్రీరామరామా॥ శ్రీ

87 అనుదినమునీతోడనూవిహరించుఅనుజుడగు లక్ష్మణుడునూ
వినిపించడాయెనీకూనాజాడపిశిదముగ రామరామా॥ శ్రీ

88 వేమారకను నెప్పుడూ నినుగొల్చువీరహనుమంతుడైన
నా మొరలువిని తెల్పడే పలుమారునీతోను రామరామా॥ శ్రీ

89 యింతకఠినముబూనినా భక్తులూయెటులతాళ్లుదురయ్యా
పంతమేలనుమాపయీబోచుటకు భారమా రామరామా॥

90 ధరనీమశతకమెపుడూ యాచంద్రతారార్కమై జెలంగా
పరిపూర్ణ భావమూతో భక్తులకుఫలమొసగు రామరామా॥ శ్రీ

91 నాహృదయపూర్వకముగా శతకంబునీకంకితముగనిడితీ
నీహృదయపూర్వకము గాదయజూడునికనన్ను రామరామా॥

92 వృద్ధయాసంబాయగా నినువేడుటర్థమనుచుతోచెగా
నిర్దయాబూని నావేయికనిన్ను నేమందు॥ శ్రీ॥

93 యింతకఠినుడవనుచునూ ముందేనీఅంతుదెలసితెనాకునూ
సుంతైననీనామమూనుడువనూసున్న శ్రీ రామరామా॥ శ్రీ

94 పాపపూజన్మమందూ నన్నేలబడవేళినావుముందూ
కోపమొచ్చినవిడువన్నానన్నేలుకొనుము శ్రీరామరామా॥ శ్రీ

95 నీదర్శనంబునాకూ మహాత్కౌనిజముగానివ్వకున్నా
యేదినిఫలమనుచునూ నగదమా యెల్లరును రామరామా॥ శ్రీ

96 నీవైదైవంబనుచునూనమ్మితినినికనిన్ను నమ్మరాదూ
నీవైదైవమ్మువైతెనూకనుపడవ నిజముగా రామరామా॥ శ్రీ

97 శరణాగతారక్షకూడను బిరుదుచేతెలగట్టినావూ
ధరనుహేళింతునాకూ లేకున్నదర్శనము రామరామా॥ శ్రీ

98 సంతసించితి నేటికీ నాహృదయమంత యానందమొందె
శాంతియగు నీదర్శనం స్వప్నమునగంటి శ్రీరామరామా॥ శ్రీ
99 పిలచి తేపలికినావూ పలుమారుతలపులాకందినావూ
నిలచితిని నీభక్తిలోనన్నిటికి నీవె శ్రీ రామరామా॥ శ్రీ
100 గోరంతదీపమెలుగా చీకటీకోనంత వెలుతురాయే
పారిపోయెనుదురితముల్ నీపాదభక్తిచే రామరామా॥ శ్రీ
101 భక్తిరసముప్పొంగగా నీపైనిబహుగానుమనసునిల్పి
శక్తికొలదిగ వ్రాసితీ నేను యీశతకంబు రామరామా॥ శ్రీ
102 పరికింపశతకమంతా భక్తిరసపిండవుత్పత్తి యూనూ
నేర్పుతో వ్రాసినానూ లోపములనెర శ్రీ రామరామా॥ శ్రీ
103 సకలపండిత కవిజెనాసుజనార్య సభికులకునెల్లమొందే
ప్రకటితంబుగనిడియెదా దండనులు పదివేలు రామరామా॥
104 తప్పులొప్పులు మెరుగనూ నవియన్ని తగదిద్దరయ్యమీరూ
వొప్పునుచు మదికిదోచినటు నేను వ్రాసితిని రామరామా॥ శ్రీ
105 యీశతకమును చదివినా వినిననూ యింపుతో వ్రాసినానూ
వాశిగామోక్షపదవీ సమకూరివర్ధిల్లు రామరామా॥ శ్రీ
106 భక్తిపరులీపాటనూ మదినిల్పిపరగధ్యానించినానూ
ముక్తికీ త్రోవజూపాయిదియేను మూలంబు రామరామా॥ శ్రీ
107 యేకధ్యానముతోడనూ యీపాటయేప్రొద్దుధ్యానించినా
ప్రాకటంబుగ శ్రీహరీ సర్వమును ఫలమొసగు రామరామా॥
108 ధరనుగుంటూరుజిల్లా వినుకొండతాలూకలోనుండెడీ
వరనడీ గడ్డపురమూనందు నివాసుండు రామరామా॥ శ్రీ

109 వసుధవల్లుట్లగోత్రా బోడెపూడివంశాన్వయా సోముడై
వాశిగల వెంకయార్యునకు నేనువరసుతుడ రామరామా॥

110 సుకవినామంబుమఱియూ వెంకటాసుబ్బరాట్కవివరుండా
జోకతోవిరచించితీ శతకంబు జోహారు రామరామా॥ శ్రీ

111 నీకంకితముగ వ్రాశీశతకంబు నీకుసమర్పించితీ
జోకతోమంగళంబూ గొనుమిదే జోహారురామరామా॥ శ్రీ

గద్య- ఇయ్యది గుంటూరుజిల్లా వినుకొండతాలూకా నడిగడ్డగ్రామ
శ్రీరామచంద్ర కరుణాకటాక్ష వీక్షణాలబ్ధసంపన్న పదపద్య
కవితాధురీణ సంగీతనిపుణ, వల్లుట్ల గోత్రపవిత్ర
బోడెపూడి వంశ పయఃపారావారా రాకాసుధా
కర వెంకయాఖ్య ప్రియసుత వెంకట
సుబ్బయ్య సుకవి ప్రణీతంబైన
శ్రీ రా మ రా మ శ త క ము.
సర్వము సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

